


## ద్వితీయ భాగము.

గ్రంథకర్త:

పంతము ఆంజనేయ కవి.

మొదటికూర్పు 1000 ప్రతులు.

కొండా వీరయ్య ఆండ్ సన్సు గారి భారతీముద్రాక్షరశాల

యందు ముద్రింపబడియె శికింద్రాబాద్.

 PRICE 0-5-0

1936.



గ్రంథకర్త:

పంతము ఆంజనేయకవి.

# అవతారిక

నేనీ పద్యకావ్యమును కేవల కల్పిత కథగఁ బంచ తంత్రాది కావ్యముల దృష్టియందిడుకొని, యేయొక్క వ్యక్తిని దూషించు తలంపునఁగాక, యీ యఖిలాండకోటి బ్రహ్మాండ మున నిత్యజీవితమందు మన కనుభూతముగను దృగ్గోచరము గను జరుగుచుండు విషయములనే మృగపక్ష్యాదుల కథలుగా కల్పించి, లోకోపకార నిమిత్తమై నీతిదాయకముగ రచియిం పంబూని రెండుభాగముల నింతవరకుఁ బూర్తి గావించితిని. ఇటులనే కథావిషయముం బట్టియు, నోపికంబట్టియు మఱి కొన్ని భాగములుకూడఁ బూర్తిజేయం దలంచితిని.

ఇది యిట్లుండ "గుమ్మడికాయ దొంగలు భుజములఁ దడవుకొను" సామెతగా పలువురు పలువిధములుగ దీనిని వారివారి నుద్దేశించి వ్రాయబడి యుండునాయని సంకోసించు చుండుటయేగాక, వారిగుఱించియా! వీరినిగుఱించియా! యని పలువురునన్ను, బ్రశ్నించుచుఁ గూడనుండిరి! ఇది మిగుల శోచనీయము.

అందు ముఖ్యముగ మన్మితులు శ్రీయుత ఓగిరాల సుబ్బారావుగారు, తమనే దివాంధముగ జిత్రించితినను భ్రాంతి

చే నాకేగాక యభిప్రాయప్రదాతలలో, గొందరికి మాత్రి
కూడ నోటీసుల జారిజేసియుండిరి ! ఈద్వితీయ భాగము
బట్టియైనను వారు సత్యమును గ్రహించు కొందురుగాక, దీ
నిటులనే దివాంధ నిర్యాణము వఱకును గొనసాగించి మ
కొన్ని భాగములు గూడ దుష్టులు వారివారి దుశ్చేష్టి
ములచే జెడుదురనియు, శిష్టులు కష్టములకు గాలవశంబున
బాలగు నప్పటికిని; సత్యమేవజయతి, యనునార్యోక్తి నను
రించి కాపాడబడుదురనియు లోకమునకు జిత్రకథా కల్పి
ముగ వెల్లడించుటయే నాయుద్దేశ మైయున్నది.

గ్రంధకర్త.

III

# పండితాభిప్రాయములు.

From,
Brahma Sri Rao Sahib
Pandit Ganala Ramamoorthy Garu,
M.L.C., F.M.U., Vizagapatam.

To,
M. R. Ry,
Panthum Anjaneya Kavi Garu,
Secunderabad.

ఆర్యవర్య!

మీరు దయతో బంపిన "దివాంధము" అనుపద్య కావ్యము నందందు స్థాలీపులాకన్యాయంబున బరిశీలించినాడ, కవిత్వము ప్రథమప్రయత్నమే యయ్యునాతి కఠినమై మృదు మధురముగనుండి ద్రాక్షారస పాకమునబడుట బూర్వపుణ్యముగ భావింప బడవలసి యున్నది.

ఇట్టి గ్రంథముల వ్రాయు నలవాటు మన తెలుగు వారి యందింకను పరిపక్వ దశనందని మాట వాస్తవమునకు దూరముకాదు. అభాగ్యోపాఖ్యానము, శనిగ్రహము మున్నగునవి పరిమితి సంఖ్యగలవియే.

ఆంగ్లభాషలో అలగ్జాండరు పోపు మున్నగు వారు డన్సియెడు మొదలగు సెటైరులను వ్రాసి అన్యాపదేశ గ్రంధములకు మార్గ దర్శకులైనను మీరంతకంటె సున్నితమగు కావ్యవస్తువును విస్తరింప గలుగుట శిరఃకంపమును గలిగించు చున్నది. వైదర్భీశయ్యతో సాగిన మీకవితాలక్ష్మి ముందు ముందింకను సొంపుమీర నవకాశ ముండుటచే మీరింకను ఉత్సాహాతి రేకముతో గ్రంథరచన యొనర్చి ఆంధ్ర సరస్వతి నర్చించెదరు గాక యని హెచ్చరించు చున్నాడ, చిత్తగించుడు.

గా. రామమూర్తి.

శ్రీ ర స్తు.

చం॥ అరసితిమీరలంపిన 'ది♦వాంధము' పల్కులయల్లికల్ మనో
హరములుగాదనర్చెహృదయంగమమయ్యెగథాక్రమంబుమీ
విరచనకల్పనంబో,యొక ♦ వేళయాదార్థమొ,యే నెఱుంగ దు,
స్తరకలుషైకహేతువుకృ♦తఘ్నతయంచుమదిగ్రహించితిం
చ॥ చెలిమియొనర్చియాపయిని♦స్నేహితుదూరుటమేలుగోరునె
చ్చెలిని దొసంగులాడుటవి ♦ చిత్రకథల్ సమకూర్చిధీరవ
ర్యులకొగిఁబోరుబెట్టిముదమొందుటయివ్విదివాంధకార్యసం
కలితకథారహస్యములు ♦. గాఁగమనించితినయ్యమిత్రమా!

ఉ॥ ఏయటవీస్థలంబుకడ ♦ నెన్నడుమీ కథసంఘటించెనో
న్యాయముగా నెఱుంగ; నిఁక ♦ నందలివార్తల పైని నేనభి
ప్రాయ మొసంగఁజాల సము♦ దంచితభవ్యకవిత్వతత్త్వధౌ
రేయులుమీరలంచువివ ♦ రింతును గాదనవారలుందురే!

హనుమకొండ. } శేషాద్రి రమణకవులు
శతావధానులు





# దివాంధము.

## ద్వితీయ భాగము.

క॥ శ్రీలలనా హృదయాధిప!
పాలితబ్రహ్మాండ భాండ! ♦ పద్మాప్తకు లీ
నా! లక్ష్మణ భరతాగ్రజ!
శైలసుతా హృదయ పంక ♦ జాతద్యుమణీ! 1

క॥ హనుమన్నాముని పదములు
మనమునఁ దలపోసి పూర్వ ♦ మార్గకవుల యా
ధునిక కవీంద్రులయును నడ
కను లెస్సగ నెఱిఁగి చిత్ర ♦ కథ రచియింతున్. 2

వ॥ అని యిష్టదేవతా కవిజనస్తోత్రం బాచరించి నాచెప్పం
బోవు కథాక్రమం బెట్టిదనిన. 3

సీ॥ నిండారఁ బూచిన ♦ నెత్తమ్మికొలఁకులు
లలిత కళోపాస ♦ కులరనంగ

నిలనుండి నింగికి ♦ నెగసి శోభిల్లెడు
వృక్షజాలము జ్ఞాన ♦ వేత్తలనఁగ
వాతాహతిని రొద ♦ ల్వాఱలఁ గా నెగడెడు
పర్వతంబులు వేద ♦ పాఠులనఁగఁ
జెలఁగి గుట్టలఁ బల్ల ♦ ములఁదొర్లి ప్రవహించు
ఝరములు సంగీత ♦ శాల లనఁగఁ
గీ॥ జెన్నుమీఱుచుఁ గానన ♦ సీమ మెఱయుఁ
దానె ప్రభువయి తనకెందు ♦ దర్పమందుఁ
దీసిపోవని హస్తి మం ♦ త్రినిగఁ జేసి
యేలుచుండెను హర్యక్ష ♦ మెదురులేక. 4
శా॥ ఆకంఠీరవనాదముల్ నుడులస ♦ ద్యస్ఫూర్తియుం గీర్తియుల్
లోకంబెల్లడఁ బ్రాఁకవన్యములు పె ♦ ల్లుంబెల్లుఁ గాఛాత్రులై
వీకం దద్గురుసేవఁ జేసి ఘనమౌ ♦ విద్యల్స మార్జించిరా
జోకం డీకొనువారిఁ జేసిరటులు ♦ చ్చుల్ద్రెంచుకో బాఱఁ
క॥ పులులుం బిల్లులు మెకములు (గన్.
కలకంఠములట్లుఁ గొన్ని ♦ కాకంబులు సం
కులముగఁ దరిఁజేరినఁ దాఁ
దలఁ గొని సింగంబు విద్యఁ ♦ దగు గతి నేర్పెన్. 6
సీ॥ గండుఁ గోయిలపిండు ♦ గాన మాధుర్యంబు
భావపూరంబుగాఁ ♦ బరఁగ దిద్దె

శుక శారికాదుల ♦ సొంపుఁ గుల్కెడిఁ బల్కు
లర్థ గౌరవమొప్ప ♦ నట్లుఁ దీర్చెఁ
గొక్కరొక్కోయనుఁ ♦ గుక్కుటంబుల కూఁత
శబ్దార్థ విజ్ఞాన ♦ సరణిమార్చె
రొదలతో సొదలతో ♦ రూపించు ఘూకారి
మృదుశయ్యలనుఁ బాడ ♦ మేళవించెఁ

గీ॥ బ్రాతవడి కానవడ్డ ప్ర ♦ బంధములనుఁ
దెరించి సరిమూత్న పద్ధతిఁ ♦ దీర్చి దిద్ది
రాజమార్గంబుఁ ద్రొక్కెనై ♦ రావతంబుఁ
బోలు నిభరాజు తన కుడి ♦ భుజముగాఁగ. 7

వ॥ ఇట్లయ్యిరువురు గురుమార్గంబుఁ ద్రొక్కి. తత్కానన సీమ నేకచ్ఛత్రాధిపత్యంబువహించి యేలుచున్న గొండొక కాలంబునకు. 8

ఉ॥ అందున రెండుకాకులు పి ♦ కంబులుగాఁగను విఱ్ఱవీఁగి పెక్
కందరగోళముల్ సలిపి ♦ కాసట బీసట వ్రాఁతలెన్నియో
పొందుగ వ్రాయఁదద్గురులు ♦ బుద్ధులు సెప్పుచుఁదిట్టిపోయఁగా
నందొకపక్షి మ్రగ్గఁబరి ♦ హాసమొకో! గురునింద సేయుటల్!

ఉ॥ వారి ప్రతాపముల్ విని య ♦ వారితభక్తినిఁబిల్వఁబంచి బం
గారపుఁగానుకల్ చ్చివని ♦ కాజని కాంతములైన పుష్పముల్
హారవిభూషణంబులుఁగ ♦ సర్పణఁజేసి నమస్కరింతు ర
వ్వారలుకాననాంతర ని ♦ వాసులు దాసులుఁగాగవారికిన్

చ॥ ధనమున గౌరవంబునను ♦ తమ్మెదిరించిన వారిగెల్చుటన్
ఘనమగు శిష్యసంపదను ♦ ఖ్యాతిని నీతిని నెల్లరీతులన్
వనమున వీరికిందగిన ♦ వారలు లేరను మేలిమాట కుం
దనరుచుమై త్రిపెంపొసఁగఁ ♦ దారటులుండిరి కీర్తికాములై

వ॥ ఇట్లా గజసింహ యుగ్మంబు నిజకాంతిం దత్కానన సీమ దశదిశలం బ్రసరింపఁజేసి వెలుంగుచుండు కొండొక కాలంబునకు దివాకరుండస్తమించుకరణిఁ గాలకర్మ వశంబున నగ్గజంబు దివంగతంబైన. 12

ఉ॥ హాయనుఁబోతివాయనుఁబ్రి ♦ యాయనుసత్సభలన్ దివాకరుం
డా!యను, శత్రువర్గపరి ♦ హంత! సఖాయను, నన్నువీడఁజ
న్నేయను, దేవవర్గముల ♦ నెక్కటిఁ బోరఁగ నెట్లునేర్తువో
యీ! యను సింహమూర్తిని గ ♦ జేంద్రవియోగవఁనన్గలంగు

సీ॥ అర్థింపబ్రహ్మమ ♦ యమగు బ్రిపంచంబు (చున్.
నాతండెకూర్చెనై ♦ క్యంబు మనకు
నుడులలో నడలలో ♦ నూత్నభావంబుల
భేదమించుకలేదు ♦ పేర్మిమనకు
గురునిగా నృపునిగా ♦ గూర్మిమిత్రునిఁగాఁగ
గౌరవించితివి య ♦ ఖండబుద్ధి!
నిర్వ్యార నేరిపై ♦ నీగ్రవాలినగాని
గల్గెడుబాధ యొ ♦ క్కటిగ మనకు

గీ॥ నీవు నేనను భేదంబు ♦ నెఱుకఁబడక
ఏలితిమి సర్వకానన ♦ మింతదనుకఁ
జాలనను భీతిలేదు స్వ ♦ శక్తి కలదు
కాని యెడబాటెనన్న దుః ♦ ఖమున ముంచు. 14

గీ॥ అనుచుఁదలపోసి తలపోసి ♦ యార్తిఁగుందు
తరుణమునుఁగాంచి కుత్సిత ♦ పరులు కొంత
పూర్వవైరంబులను మున్నె ♦ పొంచియుండి
పగనుసాధించుకో నిప్డు ♦ పైకివచ్చి. 15

సీ॥ అయిపోయె వీరి ప ♦ ర్యవసానమిఁకమీఁద
సాగిరాదాట త ♦ త్సరణి హరికి
నరి దుర్గములఁగూల్ప ♦ గరిలేదు నేఁడింక
గర్జనంబులగుండ్లు ♦ కదలునొక్కొ!
కూఁకటివేఱుతోఁ ♦ గజములఁబెకలింప
గరికిఁగాకాశక్తి ♦ హరికిఁగలదె?
కాసారములఁజొచ్చి ♦ కళలగాలింపంగ
హస్తికేగానిసిం ♦ హమునకగునె?

గీ॥ అనుచుఁగసిఁదీరసరిపడ ♦ నట్టివారు
లాడుకొనుచుండె వన్యము ♦ లచ్చటచట
విని సహించుటే మెఱుఁగని ♦ వీరసింహుఁ
డవనికంపింప గర్జించె ♦ నంతనిట్లు. 16

శా॥ ఏమీ!యిప్పుడుమీరుదండిమగలై ♦యీవాదముల్సల్పఁగా
నాముష్యాయణులౌదురో!సభనెం♦ దైనన్ సరేకూర్పుచో
జీమూతంబుల వాయుదేవుపగది♦ జ్జెండాడి; శుండాలమో?
సామర్థ్యప్రతిభావిశేషముల న♦స్మచ్ఛక్తియో! చూపెదన్

వ॥ అనుచు గర్జింప నారోషభీషణ నినాదంబు గాననంబెల్లఁ
బిక్కటిల్ల! 18

సీ॥ కరిబృందములు భీతి♦ హరియూథములఁజొచ్చె
హరిణముల్ చిఱుతల ♦ దరులకుఱికె
వృషభముల్ బెబ్బులి ♦ పెనుకందరలడాగె
నేదులు ఖడ్గాల ♦ నిఱియ దూరె
నెలుఁగుతెల్లునఁగొండ ♦ చిలువలనెగఁబ్రాకె
నహివర్గములు బర్హి ♦ యండఁబాఱెఁ
బెదరి ఘాగంబులు ♦ వృకసమూహముఁజేరె
శశములార్తినిఁగూడె ♦ జాగిలముల

గీ॥ నక్కలునుఁగుక్కలేకమై ♦ నలుఁగెలంకు
లందుఁదిరుగాడె గుండియ ♦ లదరిపడఁగ
దెక్కలల్లార్చిపక్షులు ♦ రేగనింగిఁ
గాననంబెల్లనత్తఱిఁ ♦ గలఁతఁజెంది. 19

ఉ॥ అంతటిగౌరవంబునకు ♦ నామృగరాజటు లూరకుండినన్
వంతయె లేకయుండెడిది ♦ వార్థకముందరియంగవచ్చెఁదా

నంతకువృద్ధ కేసరిని ♦ నండగ మంత్రినిఁ గాఁగఁజేసి సా
మంతులమీఁదికిఁ దుమికె♦మాఁయురె! కీర్తికిఁదృప్తి లేదుగా?
॥ పదములఁ దోఁట్రుపాటొదవ ♦ భావములుఀ సరితూఁగ (కున్న మె
త్తదనముఁగంఠమందొదవ♦ధాటియునంతకుఁగొంతతగ్గఁగా
మదకర వైరివర్గములు ♦ మాఱెదురందలకొన్నసందడిఀ
ముదుసలులైనసింగములుముష్పుఘటించునటంచు నేర్పుతోఀ
॥ ఇంటికిని దారిఁబట్టిరి; యిర్వురంత (21
నీవుశుంఠవు, శుంఠవు ♦ నీవటంచుఁ
గినుక నొండొరు నిందించు ♦ కొనుచు మగుడ
వారుఁదలపెట్టరైరియ ♦ ప్పగది దిరుగ. 22
॥ పనివడియెవ్వరేన్పిలువఁ ♦ బంచినఁదానొకరుండసింహమే
గును, చనిపూర్వపుంగథలు ♦ గోవిదబుద్ధినుపన్యసింపఁ గా
వనపతులంతకుఀ మిగుల♦భక్తిని నిచ్చెడుఁగాన్కలంది సం
జనితముదంబునన్మరలి ♦ శాంతినిఁగాలముపుచ్చునత్తఱిఀ
॥ ఆరామంబులఁబ్రొద్దుపుచ్చిపరికృతిఀ♦బారిథించితన్మాధురీ
సారంబెల్లనుసేకరించినిజ శి ♦ ష్యప్రాయులౌ వారికిఀ
నోరూరంగఁదదర్థముల్నుడువుచు♦న్నొవ్వొందునుంలేకసం
సారంబెంతయుఁబచ్చగాదనరనై ♦ శ్వరంబునన్దూఁగెడుఀ
గీ॥ అర్థియెవరైన నింటికి ♦ నరుగుఁదేర
నరయు "నభ్యాగతో విష్ణు" ♦ వన్నయట్లు

భార్యయుండాను నత్యంత ♦ భక్తితోడ;
దురితములువాయునాదంప ♦ తులనుఁజూడ. 25

శా॥ ఆప్రాంతంబుననొక్కహంసమును వి ♦ ద్యాబుద్ధులన్ యో
గ్యుఁడై
విప్రత్వంబునుఁబొందిపుణ్యకథల ♦ న్వేనూర్లుశోధించివ్యా
సప్రోక్తంబులుఁగాగఁజెప్పుచునుస♦త్సాంగత్యుఁడై జీవితం
బాప్రాజ్ఞుండునుఁజేయుచుండెనటనా ♦ వాసంబుకాసారమై

చ॥ ఘనతరవాగ్వివాదమున ♦ కాదుశ్రుతిస్మృతిశాస్త్రనైపుణం
బునబుధానురంజనుఁడు ♦ భూరిశమంబునయందెకాదు త
న్ననవసరప్రసంగముల ♦ నాజికిలాగెడివారిరూపు మా
పనునతితామసుండనుచు♦ వాకొనుచుందురులోకులాతనిన్.

ఉ॥ ఆతనియొద్దసింహమును ♦ నాదిని నించుక విద్యనేర్వ సం
ప్రీతినిశిష్యుఁడై గురువ ♦ రేణ్యునినత్యనురక్తిఁగొల్చి వి
ఖ్యాతినిసంచరించెనటుఁ ♦ గావునదిగ్విజయంబుసేయచో
నాతనితెన్నుకుంజనక ♦ నన్యముఖంబులనేగుచుండుటల్.

చ॥ గురువునుమించుశిష్యుఁడని♦గొప్పఁగఁదన్నెవరాడుకొన్నసం
బరమునసింగమాడు మఱి♦ వారలెహంసమునట్లిమెచ్చికే
సరికిని నొజ్జ వీరనిన ♦ స్వామజ వైరికి నేకతంబునో
సరిపడదయ్యె! లోననిది ♦ సాగుచునుండెననేకవర్షముల్.

చ॥ ఇదితగదంచుఁజెప్పనిపు ♦ డేనుగులేద! మఱెవ్వరేని వా

నిదఱియసాహసింపరు; న ♦ నేకములివ్విధిగిల్లుకజ్జముల్
పొదలికరామరావణుల ♦ పోరులుగాగనుమున్న నేర్పుతో
విదితయశుండమాత్యుఁడువి ♦ వేకముతోనవియెల్లఁదీర్చెడిన్

సీ॥ పరమేష్ఠినుండిమా ♦ వంశంబుప్రాతమై
వీరసింహులతోటి ♦ వెలయుఁగాదె
సహజమాశక్తిఁ బ్ర ♦ సాదించి బ్రహ్మయ
సృష్టించెనన్న వి ♦ శేషబుద్ధి
గెడదోడునీడగా ♦ కీలించి కరిరాజు
నేలుకోమనుచు న ♦ న్నిలకుదింపె
నింతయోయంతయో ♦ యేనేర్చినదెయున్న
నన్యగురులయొద్ద ♦ నదిపొసంగెఁ

గీ॥ గాకయుండినఁగరిఘోట ♦ కములనడక
బంటుపోకడనేర్పె య ♦ భాసుకాదె
హంసమాపాటికే యుపా ♦ ధ్యాయుఁడనుట!
యనుచుఁ దనలోనఁ దర్కించు ♦ కొనుచునుండు. 31

క॥ అత్తఱి రంగస్థలమున
బిత్తఱి ఘూకంబు ప్రాలి ♦ ప్రియవచనంబుల్
మెత్తని సేల్వాలజోడుల
నెత్తెఱఁగుననిచ్చెమున్న ♦ నేఁదెలిపితిఁగా! 32

వ॥ అవ్విధంబున నావృద్ధ సింహంబు సంతసంబున వారిచ్చిన

కాన్కలంది లోకాచారమర్యాద ననుసరించి ముందు బకదివాంధంబుల నిరువుర నాశీర్వదించి యిట్లనియె. 33

ఉ॥ ఎవ్వరుమీరు! మీయునికి ♦ యెయ్యది. కార్యమునెద్దిఘ్రానిమీ
రివ్వనభూమిఁ జొచ్చుటలు ♦ హెచ్చినపేర్మిని నన్నుఁ జూడమీ
రివ్విధి నేగుదెంచుటకు ♦ నెయ్యది హేతువు? తెల్పుఁడన్న నా
చివ్వలమాఱి గూబయునుఁ ♦ జిర్నగవొప్పఁగనిట్లుఁ బల్కెడిన్.

ఆ॥ మిమ్ముఁ గనుటకన్న ♦ మించిన కార్యంబు
మాకు వేఱెకలదె ♦ మాన్యచరిత!
పరమయోగ్యుఁడితఁడు ♦ బకనామధేయుండు
హావణుమీఱనద్ది ♦ వాంధమందు. 35

సీ॥ కటికిచీఁకటిపిండు ♦ క్రాలుఁగారడవులు
హావణంబులగుమావి ♦ హారములకు
శాకినీ డాకినీ ♦ రాకాసి గణములు
సహచరంబులుమాకు ♦ విహరణముల
దినమెల్లఁ దిరిగి ని ♦ ద్రించు విహంగము
లశనంబులగుమాకు ♦ నిశలయందు
నాయుఃప్రమాణంబు ♦ లరసి మృత్యువుజాడఁ
జాటిచెప్పనుమంచి ♦ జ్యోతిషికుల

గీ॥ మపుడు మాతాత నేర్పెదో్ర ♦ నాత్మజునకు
శత్రుశేషంబుఁ బరిమార్చు ♦ సరణిగొంత

నేఁడు నాతోఁడఁ బుట్టిన ♦ నేర్పుగాదు
కాలములనుండి మాకుఁ బ్రి ♦ ఖ్యాతిగలదు. 36

చ॥ అనవినిగుఱ్ఱడెజల్లనఁగ ♦ నాననసీమయువెల్లఁబాఱఁబా
వనకులవంశశేఖరుఁడు ♦ వారకవారలమోముఁజూచివే
దననొకకొంతచిత్తమునుఁ ♦ దత్తరపెట్టఁగ; వీరెకామగా
మునుపటులేఖలన్నిమలి ♦ పోకడలన్నివిపించియుండుటల్!

శా॥ ఏనాడేనిటువంటిపక్షితతినా ♦ యింటన్సదాతిథ్యభో
గానందంబునఁదేలఁగానెఱుఁగ సూ♦ ర్యారాధనప్రక్రియల్
ధ్యానంబుల్జపమాచరింపఁగ దివాం♦ధప్రాతికూల్యంబులో
గానీచూతమటంచు దుశ్శకున శం ♦ కాభీతిలోనుండఁగన్.

వ॥ అంతనా దివాంధము. (38

శా॥ స్వామీ! మున్ను భవత్సకాశమునకుం♦బత్రంబులంబంపియా
స్వామిదోహులచిత్తవృత్తినట వి ♦ స్పష్టంబుగావింపఁగా
దామెంతేనియుసంతసించిప్రతిప ♦ త్రంబొండుఁవ్రాయింపరే
మేమేనుమ్మొకదీయసూక్తులకు నె♦ మ్మింబ్రాతుప్రైయుం
(డుటల్.

సీ॥ అంత మృగరాజు వారితోఁ ♦ గొంతపసియు
సానుకూలంబుఁగాగల ♦ దంచుఁదలఁచి
రెయొండురెన్నాళులాతిథ్య ♦ మొసఁగి పిదప
ననుమతించెను స్వస్థాన ♦ మునకుఁబోవ. 41

ఉ॥ అంతనుఁ దృప్తిఁ బోవకది ♦ వాంధము కొండొక యుక్తి హె
చ్చుగన్
సంతస బెట్టగా దలఁచి ♦ సామజవైరికి శ్రోత్రయుగ్మమున్
"వింతలు పెక్కులుండు నట ♦ వీస్థలి మావనమందుఁ జూడన
త్యంతము వేడుకౌ, నిజము తప్పక రావలె" నంచు గోరుచున్. (42

గీ॥ సెలవుగైకొని వారియా ♦ శీస్సులంది
బక దివాంధములు నిజ ని ♦ వాసములకు
జనిన నాఁటినుండియుఁ దమ ♦ స్వాంతములను
జూచిరా నిచ్చవోడమె కి ♦ శోరములకు. 43

క॥ పడయంగరాని పుత్రులఁ
బడయుటయుఁ దమంతవారు ♦ వారలు నగుటం
గడుఁ బ్రేమ గూర్చి సింహము
విడువంగా నొల్ల దెపుడు ♦ వృద్ధత చేతన్. 44

గీ॥ ఏదియేగాని దండ్రికి ♦ నెదురు నిలిచి
యింతదనుకను బలుకాడ ♦ నెఱుఁగకున్నఁ
జూచిరావలెనన్న యౌ ♦ త్సుక్యమునను
ధైర్యముం జేసియడిగినఁ ♦ దనయుఁ జూచి. 45

ఉ॥ పోవుట కేమిగాని యటఁ ♦ బూర్వపు శిష్యులు బంధుమిత్రులౌ
కోవిదులెందఱో మనకు ♦ గూర్తురు మిక్కిలి ప్రేమభక్తులన్
గావునఁ జింత లేదు; భయ ♦ కారణమింకొకటున్న దందహం
భావపు బెబ్బులుల్ గలవు ♦ వారినిఁ జూచి మెలంగఁ గావలెన్.

చ॥ ఎఱుఁగరు పిల్లకాయ లెటు ♦ లేఁజరియించినఁ జెల్లునింటమీ
ఱుఁగక యన్యదేశములఁ ♦ దెంపరులై జరియించుటొప్పదె
వ్వరికిని, మాయశస్సునిలు ♦ పందగఁజూడఁగఁ బోలుమీకుమీ
రరమర లేకపోయి సుఖు ♦ లై మగుడంజను టెంతొ వేగమే.

చ॥ మఱఁ చితినొక్క మాటనట ♦ మాన్యుఁ డుమత్ప్రియశిష్యు
ఁడన్ సదా
సరసవచోవిలాసవిల ♦ సన్ముఖమండలుఁ డర్థికోటికి
న్నిరతముస్వాగతంబొసఁగి ♦ నిత్యపుజీవనముంగడించు మీ
రరుగుఁడు వానిఁజూడఁగ శు ♦ కాస్వయుఁడాతఁడు మేలు
(గల్గెడిన్.

గీ॥ అనుచునామోదమునుఁ దెల్పి ♦ నందులకును
గరము సంప్రీతులగుచుఁ గి ♦ శోరయుగ్మ
మప్పుడుఁ బయనంబుఁగట్టి వ ♦ నాంతరముల
వింతలను జూచుకొనుచును ♦ వెడలిరంత. 49

ఉ॥ తూరుపుదెల్లవాఱె మరు ♦ దూపులడాకకు రేయియెల్లయున్
గూరుకు లేకయున్న వన ♦ కూటములప్పుడె గుబ్బు వెట్టుచున్
బోరుననిద్రవోదొడఁగె ♦ బూఁబొదరిండ్లను, వృద్ధవన్యముల్
కోఱలుదీటుచున్నపులఁ ♦ గోపముజేసెడిఁదన్నిమిత్తమై!

క॥ కతిపయ దివసంబులకు 50
న్నతిరయమున వచ్చిచేరి ♦ రావనమునకుం

బితృవాక్యసరణి ముందుగఁ
గుతుకంబునవారుశుక ని♦ కుంజముఁజేరన్. 51

వ॥ వారల యాగమనంబువిని. 52

చ॥ కరమపురూపమై కనఁగఁ ♦ గల్గెనుసింగమువీరిఁగాన, భా
సురముగఁగండ్ల దత్సుతులఁ♦జూతమురండని వస్న్యులెల్లనొం
డొరులకుఁజెప్పచుండెరలి♦యొండొరులంగడవంగవచ్చిజూ
చిరియొకచిత్రమౌగతిని♦సింహకిశోరులవింతచూపులన్. 53

చ॥ విడుదులుభోజనఁబులను ♦ వింతెలువింతలుపిండివంటల
ప్పడములు పాయసంబులునుఁ♦ బాలును నేయియు జున్ను
మీఁగడల్
విడియముగంథమాల్యములు వేయివిధంబులఁగూర్చిభక్తితో
గుడువఁగఁబెట్టుచున్ హితముఁ♦ గూర్చుచునుండె శుకుండు
వారికిన్. 54

సీ॥ వీరిరాకను విని దివా ♦ భీతి వేగ
శుక నివాసంబుఁజొచ్చి కి ♦ శోరములను
స్నేహపుంగౌఁగిలింతలఁ ♦ జిక్కఁ బట్టి
పూర్వపరిచితు శుకుని న♦ వ్వుచును జూచి. 55

సీ॥ ఇతని గృహమునఁజేర నిం ♦ కేమి కొదువ?
లిట్టిస్వాగతంబులు కొ్రొత్త ♦ లెప్పుడుఁ గావు
పేదవారిని మమ్ము ను♦ పేక్షఁజేసి
వచ్చుటే దెల్పకుండుట♦ పాడియగునె? 56

చ॥అని కపటాంతరంగ మెన యంగదివాంధముపల్కు మాటలన్
విని శుకమంత, ''మీరలన ♦ వేఱోనా! వీరిభవద్గృహంబుకే
గొనిచనవచ్చుదీనమన ♦ కుంగలభాగ్యపుఁదారతన్వ్యముల్
గొనకొని లెక్కలా! పసిడి ♦ గ్రుడ్లను బెట్టరు వీర లెందునన్! (57

గీ॥ అనుచు సహజంబుగాఁబల్కి ♦ నట్టిమాట
వ్యాఖ్యలను జేసి యర్థంబుఁ ♦ బాఱబట్టి
చూచితిర!వీని గర్వ వి♦ స్ఫూర్జితంబు
నుండదగదింక పోదము ♦ రండటంచు. 58

గీ॥ వెంటఁ గొనిపోయె నాకోట ♦ డింటికపుడు
మూడునాళ్ళముచ్చట తల ♦ మునకలైన
మగుడఁ గొనివచ్చి మంచిగ ♦ మాటలాడి
శుక నికుంజంబుఁ జేర్చెహె ♦ చ్చులకు బోక. 59

క॥ వచ్చినఁ బోయిన మగుడం
వచ్చిన నొకపగిదిఁ గానె ♦ స్వాగతమిచ్చెన్
ఇచ్చకము లెప్పుడతనికి
నచ్చవు మఱిలౌకికంబ ♦ నన్ దెలియఁడుగా! 60

ఆ॥ పంచదార తేనె♦ పాలు మీఁగడఁబెట్టి
పలుకమన్న శుకము ♦ పలుకునిచ్చ
నభము శుభము లెఱుఁగఁ ♦ డా మాటలందున
శత్రువైన గుట్టుఁ ♦ జాటుచుండు. 61

ఉ॥ కొన్నిదినంబులప్పగిది ♦ గూడ నిరంతర కార్యదీక్ష సం
పన్నుల నాశ్రయించి పరు♦వంబగు సత్సభనొండుగూర్చియ
త్యున్నతమైనగౌరవము♦నొందఁగఁ జేసి కిశోరయుగ్మమున్
దిన్నఁగఁ "బుట్టపెట్టె" నతి♦ధీరుఁడు వాఁడిటువంటి యెత్తులన్

ఉ॥ వారికి వారివారికిని ♦ వార్థకముం దటియుంగ నింటిలో
నూరకయున్న కేసరికి ♦ నొప్పిద మాగతి మంచి సేల్వాలుం
నూఱులమించుగట్నములు♦నూతనభంగి ధ్వజంబునొండుస
త్కారములందఁజేసె నిజ♦కార్యమునుం సుముఖంబుఁ జేయఁ
(గన్

వ॥ ఇట్లా సింహకిశోరంబులు ఘనమగు సభాసత్కారంబు వ
డసి విజయోత్సాహంబున్ మెఱసి, నిజాటవిం జేరి జ
నకుఁ బాదంబులకుఁ బ్రణమిల్లి యిట్లని చెప్పం దొడంగిరి.

మ॥ భవదాజ్ఞన్ శిరసావహించుచు శుకా♦వాసంబు కే పోవసఁ
స్తవనీయంబగుస్వాగత బులనుముం ♦ దానింటనుం జేర్చిమ
క్కువ జూ పెట్టుచు నన్నపానముల మూ♦కుంలోటు రాకుం
(డున
ట్లవధానంబుల మైత్రి జూపె నమితో♦త్సాహంబు దైవాజ్ఞఁ
(గన్

మ॥ ఘనుఁడా ఘూకముమాదు రాకవిని ని♦ష్ఠాపట్యముం జూపి రే
లనిశంబున్ మముఁ వాని వెంటఁగొని ను♦ష్ఠాత్మ్మల్ మముం జూ
చి యో

ర్వనివారిఁ విశదంబుఁ జేయుచు మిముఁ రప్పింపఁగా గూడ నే
క్కొనిదానెంతయు యత్నముల్ సలిపె మీ ♦ కుఁ వీలుఁ
(గాకుండినఁ. 66

క॥ మమ్ముల మీకటు మాఱుగ
నిమ్మగు సభనొండుగూర్చి ♦ హెచ్చగు సన్మా
నమ్ముల గౌరవ మొందఁగ
నమ్మహితుఁడు జేసె నివియె ♦ యాకట్నంబుల్. 67

వ॥ అనుచుఁ జూపుచు. 68

సీ॥ కాశ్మీర దేశపు ♦ కానన సీమనే
యుత్పత్తియగునిట్టి ♦ యున్నిసేల్వ!
లాంధ్రదేశపు సిద్ధ ♦ హస్తులొక్కరె యిట్టి
ఖద్దరు వడుకఁ బ్ర♦ ఖ్యాతిఁగనుట!
వారణాసీపుర ♦ ప్రాంతమందునెగాని!
దొరకవెచ్చటను బ ♦ నారసులివి!
హిమవన్నగప్రాంత ♦ హిమరాసులనెగాని
పెరుగదిట్టి ధ్వజఁపు ♦ వృక్షజాతి!
గీ॥ అచటి టంకంబు లివియెంత ♦ యందముగను
మెఱయు చున్నవొ చూడుడు! ♦ మీరలనుచు
బాలురాడుచు సంబర ♦ పడుటఁ గాంచి
నవ్వుకొనుచుండెలోన వ ♦ న్యములు రేడు. 69

వ॥ వీరు మున్నున్నండు నిట్టి సభా సత్కారంబుల వడయమిం
జేసి ప్రథమావస్థయందున్న వారలు, వీరి యుత్సాహం
బునకు భంగంబుఁ గలిగించుట యుక్తంబుఁ గాదని తలంచి
సింగంబు నిజకిశోరములం దిలకించి నాటి సభకెవ్వారెవరు
విచ్చేసిరని యడుగ వారలిట్లనిరి.

మ॥ శుకముండెన్ బకముండె యవ్వనమునన్ ♦ శుండాలమొం
డుండె శా
బకశార్దూలమునుండెఁ గోకిలముస ♦ భ్యత్వంబునందుండె, శా
రికయుండెం, గరుడుండునుండెనతి గ ♦ ర్విష్ఠుండువీడెప్పుడున్
వికటప్రశ్నలమమ్ము నేచుకొనుచున్ ♦ విద్యల్ పరీక్షించెడిన్.

ఉ॥ ఆతఁడు ఘూకమన్ననిక ♦ నార్చుచు మూరెడు వేర్చు గయ్యా
ముల్
బీత్రి వహించి వారితల ♦ వీరికి వీరిదివారికిన్ మహా
చాతురిమార్చుచుండు నని ♦ జావగదిట్టుచు వేళపట్టులన్
జేతులదీటవో నడచ ♦ సిద్ధము భీకరుఁడాతఁ డెంతయున్.

గీ॥ తనయులీరీతి నచటి వా ♦ ర్తలనుఁ పూస (72
గుచ్చినట్లు బేర్మితనకె ♦ ఱుంగఁజేయఁ
బుత్రవిజయంబునకుఁ గొంత ♦ మోదమొంది
చింతనముసేయు నిజ పరి ♦ స్థితులఁ గొంత. 73

ఉ॥ ఏనటువత్తునంచునొక ♦ యెత్తున దత్సభఁ గూర్చిమీదటన్
నేనయశక్తి దెల్పఁ గను ♦ నేర్పున నయ్యది నాకు మాఱునా
సూనులుగాన వీరినటఁ ♦ జూపినగోటము! సభ్యులెల్లరుం
మానముదాల్చియుండిరి స♦మాయకుఁ డీతఁడు లొక్యుఁడెం
తయున్ 74

ఉ॥ విద్యల నెన్ని నేర్చిన వి ♦ వేకియొమైన సమాయకుండుగా
సద్యశమెన్నఁడుంబడయ♦జాలఁడు ముక్కుకుసూటిబోక నే
యుద్యమమైనఁబూనిసమ♦యోచితబుద్ధిసమాయకత్వముం
బ్రిమ్యతమొందజేయ నది♦బాఱునుమంత్రమురీతి నెల్లెడన్

గీ॥ మహితగుణగణ్యుఁడైన స ♦ మాయకుండు
గరుడుఁ డననేలఁ నంతటి ♦ కంపమొందు
మిమ్ముఁ బ్రశ్నింపఁ దగినట్టి ♦ మేటిమగఁడె!
విపుల బలమునఁ జదువున ♦ వినతసుతుఁ డు? 76

చ॥ అనవినిపుత్రులప్డువిన♦ యంబున కేల్మొటియించిస్వామి!యా
వినతసుతుండునిర్భయుఁడు♦వీరుఁడతండల గూబయన్నఁ దా
మనమునకోపముంగదుర♦మండిపడున్ మరిఘూకమిత్రులన్
గనిన నదేలొకో తగిన♦గౌరవ మీయఁడొకింత యేనియున్

ఉ॥ ఘూకమదొక్క చేయతని ♦ కోపమునన్ బడెఁగానిసద్విజా
నీకము కెల్లఁదామిగుల♦నెయ్యముజూపెడి సాధుమూర్తి తా

నేకలహంబునైనఁ గొన ♦ డెప్పుడు కుత్సితుఁ డెవ్వఁ డేని దన్
డీకొనె నేనిఁ జంపును క ♦ డిందిబలంబును జూపి తీవ్రతన్. 78

ఉ॥ ఇంత మొకాదతండు ఘనుఁ ♦ డెంతయు విద్యల గొంత నేర్చియ
భ్యంతరమించు కేని దన ♦ యాత్మవిచారణ సుంత లేక దు
ర్దాంతత బండిత ప్రవర ♦ ధాటికి నేని భయంబు నొంద క
శ్రాంతము వాదులాడుచును ♦ శాస్త్రవిచారణ మీరి చేసెడిన్

ఉ॥ మానిత ఘూకమిత్రుసవ ♦ మానము జేయును గాన నీతనిన్
న్యూనతఁ జేసి సత్సభల ♦ నొవ్వఁగ మీరు పరాభవించి మా
కానయశాలి గూబకును ♦ దంచితసంతస మొందఁ జేయఁగా
భానుడు పుత్రవాంఛ లబ్ర ♦ పూర్ణము చేసిన తండ్రి తండ్రియా

క॥ అనవుడుఁ ముదుసలి సింగము
దనయుల సత్కార ఘణతిఁ ♦ దలపోసి విలో
చనముల రక్తిమ మొందఁగ
వినతాసుతు మీద బగను ♦ వివరించు నిటుల్.

క॥ నాలావు కొలఁది నెఱుఁగక
బాలకులగుఁ మిమ్ము గేరు ♦ పక్షీంద్రు ధృతిన్
కోలాహలమునఁ బోరిగొం
డాలంబున హరుఁ డువచ్చి ♦ యడ్డంబైనన్. 82

చ॥ మనమున శాంతి నొందఁడిక ♦ మాన్పెద నేని దెనాదు శక్తిచే

ఘనుఁడగువైనతేయుబల ♦ గర్వమునంతము జేయువాఁడ కా
ననమున నెవ్వరేని జత ♦ నంబుగ నాతని పక్షమూనినన్
గనెదరు మత్ప్రతాపమిది ♦ కాలముగాదని యోర్చియుండుఁడీ.

వ॥ అని యిట్లా వృద్ధసింహంబు నిజసూనుల కత్యంతముదంబు
గూర్ప నాసింగంపు కుఱ్ఱలు వేగిరపడి మిత్రుండగు దివాభీతి
గొండొక యుత్తరంబున జనకునిచే గరుడ పరాభవం
బునకై చేయించిన ప్రతిజ్ఞం దెలుప నంతనిచ్చట. 84

ఉ॥ మూలలఁ దాగిదాగితన ♦ మోమునుఁ జూపక సిగ్గుచేటునన్
గాలము బుచ్చుగూబతమ ♦ కంబున మిత్రుల లేఖ గాంచి తా
దాళఁగ లేక వన్యముల ♦ తావున కేగియు వారితోడ గం
గాళముఁ బోలువక్త్రిఫల ♦ కంబును గ్రుడ్లనుఁ ద్రిప్పియిట్లనున్

మ॥ హరివిద్వేషిమయూరహంసముల కత్యం ♦ తాప్తబంధుండుయ
గ్గరుడుండాతనిపోతరంబునికనే ♦ ఖండించెదంజూడు డీ
ధరణిన్నొక్కనీచపక్షియనుమీ ♦ తత్త్వంబు దథ్యంబె!న
స్వరిమార్పంగను వానిచేతనగునా ♦ వాచాలు డాతండిలన్.

సీ॥ కోట డీరీతిపక్షుల ♦ గూళ్ళకేగి
సాధు గుణగణ్యు గరుడుని ♦ సారహీన
మైన మాటల దూషించు ♦ టదిగ్రహించి
శాంతివిడనాడిద్విజరాజు ♦ సభను గూర్చె. 87

వ॥ ఆ సభకు నరుదెంచిన వన్యంబులెవ్వియన? 88

సీ॥ శుకశారికాపిక ♦ నికరంబునొక్కకేవ
శార్దూలశాబక ♦ సంఘమొకట
భ్రమరంబులును చక్రి ♦ వాకంబులును హంస
బకఘూకములునొక్క ♦ పక్కఁజేర
చమరీమృగంబులు ♦ శరభంబులును లేళ్లుఁ
జివ్వంగియేదులు ♦ సింధురములు
కణుజులు దుప్పులు ♦ కారుపందులు జింక
పిల్లలు పిల్లులు ♦ భల్లుకములు

గీ॥ సభను నెలకొన గరుడుండు ♦ సభ్యులకును
వందనము జేసి ఘూక ప్ర ♦ వర్తనంబు
లవముదప్పక నీరీతి ♦ లలితమైన
పదములను గూర్చి నేర్పున ♦ బలికెనిటుల 89

వ॥ సద్గుణ గరిష్ఠులైన యో వన్యములారా? దివాంధుని ప్రవ
ర్తనంబెట్టిదో యెఱుంగంజేసెద సావధాన చిత్తులరై
యాకర్ణింపుడు. 90

సీ॥ పటుపయోముఖవిష ♦ ఘటమునా గోముఖ
వ్యాఘ్రంబురీతిని ♦ నభినయించు
నాకరి మేలున కెపుడు ♦ యోర్వజాలని నీచ

చిత్తుండు దుర్గుణ ♦ చేష్టితుండు
పరుల మోసముఁ జేయు ♦ భావంబుఁ గలవాఁడు
హరిపదధ్యానుల ♦ కతివిరోధి
యితరకులీనుల♦కిడుమలఁ బుట్టించి
శాఖలేర్పడఁ జేయు ♦ చపలుఁ డరయ

గీ॥ నీతిబాహ్యుండు కుటిలుండు ♦ నీచమతియు
పూతచరితుల దూరెడి ♦ పాతకుండు
గురువరేణ్యుల మనముల ♦ కుళ్ళఁ జేయు
పరమ దుర్మార్గుఁడీ నీచ ♦పక్షికులుఁ డు. 91

వ॥ పరమపావనుండగు మయూరేంద్రునియెడ విద్యార్థియై
తదనుగ్రహంబు వడయు పట్లంజేయు మాయోపాయ
శుశ్రూషాక్రియం బెట్టిదనిన. 92

చ॥ గురువగు బర్హిపాదములు ♦ గోరిభజించియు నింటనాతనిన్
సరసకళత్రయుక్తుఁడయి ♦'సద్గురువీవె'యటంచు మ్రొక్కి సం
బరమునపాదముల్ కడగి ♦ భవ్యత దజ్జల శేష మెంతయున్
శిరమునఁదాల్చిదివ్యమని♦శిష్యువినమ్రతఁగొంతజూపుచున్

ఉ॥ మ్రొక్కివినమ్రుఁడైనెమలి♦మ్రోలనుదాసునిమాడ్కి సేవలన్
జక్కఁగఁజేసియమ్మహితు♦సత్కృపగానముఁగొంత నేర్చితా
నిక్కుచుబర్హి "గృష్ణు"ఁడని♦ నెయ్యముమీఱఁగ బల్కు
చుండుఁన

ల్దిక్కుల జాటుదాఁ దనవి♦దీరక సద్గురు కీర్తి నెల్లెడన్.

ఉ॥ చాటును బర్హివిద్యల ని♦శాటుఁడు దిగ్దిశలందు నెవ్వరే
పాటియునిల్వఁగాగలరె♦ప్రౌఢతమద్గురుప్రేమాలనంచుఁదాఁ
బాటిలకుండునొద్దఁ దన ♦ పాలిటి దైవముగాఁగ నాతనిన్
నీటుగసంస్మరించుఁ గడు♦నేర్పునమోసపుభక్తిఁజూపుచున్.

ఉ॥ కుంటిద్రోగుడ్డిద్రోహుఁడు♦ కోరినవిద్యను గొంత నేర్చెఁ గ్రొ
క్కొంటిని యభ్యసించితిని ♦ కోవిదులందఱు మెచ్చవిద్యనే
గంటినటంచు గర్వమున♦ గన్నులు గానక గుడ్డిపక్షి బల్
తుంటరియాచు బెద్దలను ♦దూరదొడంగెను ధర్మదూరుఁడై

వ॥ అంతంగొండొక కాలంబునకు. 97

ఉ॥ గానమునేర్చినాడ, హరి♦ గాథలుఁజెప్ప క్రమంబెఱింగితిన్
మానసమందు నే గురుని♦ మన్నన చేయుటి కేలటంచు దా
బూనఁడు బర్హిసద్గురుని♦పూజలు పూర్వమొనర్చినట్లు, యే
దోనటనంపు వాలకము♦తో సరిఁబుచ్చును కాలమంతయున్

చ॥ గురుఁడగుబహిరాడ్వరుఁడు♦కోరినయట్లయులూకశిష్యునిన్
వఱలెడిరీతి గీతముల ♦ పద్ధతిఁ గొంత నెఱుంగ జేసి, సు
స్థిరమగుకూర్మిఁజూపుమరి♦చిత్తమునందునవానిమోన తా
నెఱుఁగడ యుత్తముల్ కపట ♦ మెట్టులెఱుంగుదు రయ్యె
పృథ్విలో.

ఉ॥ అంతయొనింతయోగురుని♦యండను విద్యలనభ్యసించి యే

4

కాంతమునందు సద్గురుని♦కన్నను మిన్నగ కీర్తిఁ బొందఁగా
జింతనఁ జేసి యాపిదప♦ జెన్నువహించిన సద్గురోత్తమున్
వంతలఁగుందఁజేసిచెఱు ♦ పందలపోయుచునుండెదుష్టుఁడై

వ॥ దివాంధుని చెడునడతలఁ గ్రమక్రమంబుగా దెలసి మయూ
రంబిట్లు వితర్కింపఁ దొడంగె. 101

ఉ॥ తాకినవ్రేలికేమరలఁ ♦ దాకినభంగి దలంపమీద మీ
ద్రైకనుపట్టె కీడులహా♦ హా యిదిధర్మమె ఘూకమింతకున్
బోకిరివృత్తిఁ బూని ననుఁ♦ బోరఁగవచ్చె నికీశ్వరుండె నా
కీకలుషాత్మచిక్కల నో♦ కింతయుఁజిక్కకరక్షఁ జేయుతన్

చ॥ గురువనిమత్పదాబ్జములఁ♦ గోరిభజించియువిద్యనేర్చి యీ
పరమ దురాత్ముఁడీ పగిది♦బద్ధవిరోధముఁ బూనిశత్రుఁడై
గరువముతోడఁద్రిమ్మరుచు♦కారులుప్రేలిదురుక్తులాడు శ్రీ
హరికిని దాసుఁడేనయిన ♦ నంతముఁగల్గదె వానికింతటన్.

చ॥ భవరుజఁబాపునౌషధము ♦ పాపసమూహఘనాళివాత మ
త్యవగుణకాననాగ్ని విప ♦ దబ్జమదేభము భక్తమానసో
త్సవఫలదంబు శ్రీహరి ను ♦ తంబదిగావున భక్తితోడ కే
శవవరనామకీర్తనము♦ సాధకమై వెసమ్రించుఘూకమున్

క॥ అని యిటుల బర్హి మిక్కిలి
మనమునఁ జింతించి దురభి ♦ మానుని శిష్యున్

గనుఁగొనఁ బాపంబని తాఁ
జనియెను నిజసదనమునకు ♦ శాంతాత్ముఁడై. 105

సీ॥ పక్షికుల పాలకుండిట్లుఁ ♦ బలుకనచటి
విపినవాసుల ముఖ్యులౌ ♦ ద్వీపము పికము
సరస హంసంబు శార్దూల ♦ శాబకంబు
పలికె రిట్టుల గరుఁడుని ♦ పక్షమూని. 106

చ॥ వనచరులార! యీఘనుని♦వాగ్గరిమంబునదోసమింతయున్
గనఁబడదయ్యెపల్కులనఁ♦గారసమొల్కెడికావ్యరూపమై
వినఁదగికర్ణయుగ్మమునకు ♦ విందొనరించెడిసభ్యులార? స
జ్జనసుతుఁడైనయీతనికి♦సాటియెనీచపుఁగోటమెంతయున్.

వ॥ అని యిట్లిభరాజ రాజహంస శాబకశార్దూల పికంబులు
దమతమ యభిప్రాయంబు లొసంగఁ దత్సభాంతరవాసు
లేక గ్రీవంబుగా నిట్లనిరి. 108

ఉ॥ ఈతఁడు మంచివాఁడు పర♦మేశ్వరభక్తియు రక్తిఁగల్గి వి
ఖ్యాతిని సంచరించు మన ♦ కాననమందున నెవ్వరెప్పుడే
రీతిని సాయమున్ నడుగ♦ రివ్వన వారల కాప్తబంధుఁడై
చాతురిజూపికార్యములు♦చక్కబడన్ దగఁజేయునెప్పుడున్

చ॥ తెలియకమున్నుతాచెనటి♦దేబెకుగూబకుసాయమయ్యు వే
ఫలితము నందజేసె పని ♦ పాటుల లోటిసు మంతలేక నీ

పులుగులకేనికా కుమతి♦ పూజలుఁ జేయుటమాని దూషణం
బులకుఁ గడంగ గాఁదొడఁగి ♦ పోకిరివృత్తిఁ జరించె నీచతన్.

మ॥ జనకద్రోహులుఁ దుమిత్రవంచకులుఁ దునా ♦ చార్యాత్మభగ్నుం
దుజీ
వనరశౌర్యులబూజనీయుల దృణ♦ప్రాయంబుగా జూచి బల్
వనటల్ గుందఁగ జేసి లోకమునఁ దా♦ బాపాత్ముఁడై కోటఁడి
వ్వనమందుండుట పాడిగాదు చెనటీ♦ బారంగదోలుండిఁకన్

చ॥ పికమును హస్తి హంసమునుఁ♦ బెబ్బులి శాబకముం ఘనంబుగా
బకహితుఁ జూచి తీవ్రముగఁ♦ బల్కిన మాటల విన్నయంత నే
వికటమతిన్ దివాంధుఁడట ♦ వేగమె వారలయిండ్ల కేగి మీ
రకటమదీయ గౌరవము♦ నార్పఁగఁ దిట్టుదురయ్య క్రూరతన్

ఉ॥ సమ్మతి మీరలా గరుడ♦ చర్యలకుందగు సాక్షులౌచు నే
రమ్ముకుఁ బాత్రులౌ దురిక♦ రాగలన్యాయ సభాస్థలంబునన్
నమ్ముఁడటన్న మండి పడి ♦ నవ్యవిశారదులష్టు వానినిం
బొమ్మని తోసిపుచ్చిరి యు♦ పూజ్యునిఁ దిట్టుచు నెత్తిఁ గొ
(ట్టుచున్.

ఉ॥ అంతనులూకమోపగిది ♦ నందటిచేతఁ బరాభవంబుఁ దా
నెంతయుఁ బొందివేఉగతి♦ నేదియుఁ దోపక నేష్పమోముతో
శాంతిని బ్రొద్దుపుచ్చునయ♦ శాలిదయార్ద్రపికంబుకున్ బదా

క్రాంతుఁడుగాఁగఁదానపుడు♦గ్రమ్మర లేవఁగ నెత్తె నార్ద్రుఁడై

గీ॥ భంగ మొందియుఁ గాళ్ళపై ♦ బడిన గూబ
గతికి జాలిఁగొని కోకిల ♦ కరుణగల్గి
భయము నొందకు నానుడుల్ ♦ బ్రికటనములు
మరలఁ గైకొందు వగవకు ♦ మానుభయము. 115

గీ॥ అనుచు నొకరీతి నుడివి తా ♦ నంధపక్షి
యేడ్పు చల్లార్చెఁగాని తా ♦ నెఱుఁగఁడెట్లు
సభనుఁ జెప్పిన మాటలు ♦ శాసనంబు
లయ్యె ననుమాట పికవరుఁ ♦ డాత్మలోన. 116

వ॥ అంత దివాభీతి చేయునది లేక సిగ్గున మూలంబడి చింతి
ల్లుచుండ. 117

చ॥ ఖగపతి మాటలీవిధి వి♦కాసముఁ జెందఁగ నావనంబునన్
సుగతిజరించు వన్యములు♦సొంపుగ నాతని సత్కరించియా
పగతుఁడులూకుఁడంధుఁడని♦ పల్మరుఁదిట్టుచు గేలిసేయఁగా
మొగమునుఁ జూపలేక తల ♦ మోసిన యట్టులనుండె నిం
వ॥ ఆతరుణంబున (టిలో.

చ॥గరుడునివోలె వాగ్గరిమఁ♦గాంచ నులూకుఁడొకింత చింతనా
భరిత మనంబునం దగిలి♦ ప్రౌఢ వచోరచనా విలాసు సం

దరిసెన మాత్మఁగోరి విభు ♦ ధాన్యాయు డేగలరాజు వీటికిన్
సరసతఁజేరి యమ్మహితు ♦ సన్నిధికిఁజని భక్తి పెంపునన్.

మ॥ ఫలహారంబుల వక్కలాకులను దృ♦ప్తాస్మోవయంనా మన్నం
బలరంజేసితదంఘ్రియుగ్మములసా♦ష్టాంగంబుఁగావించియా
పలుకుల్ నేర్పి కృతార్థుఁ జేయఁగను సం ♦ ప్రార్థింప నాఁడే (గయున్
గలతంజెందిమృదూక్తులంబలుకుని♦ష్కాపట్యచిత్తంబుతో

చ॥ అరయ వరప్రసాదమగు ♦ నట్టి మహత్తరవాగ్విభూతి యే
గురువులసేవజేయసమ ♦ కూడునువీడుము వెఱ్ఱిభ్రాంతులన్
గురులు సమృద్ధిగా గలుగు ♦ కోమలి యేవిధిగొప్పవెట్టినన్
వరలును శోభ; మోపులగు ♦ వారికి గోరికలున్నఁ జెల్లునే.

తే॥ ఒకని కల్మికి నీవేల ♦ నోర్వలేవు?
శిష్టులగు వారు నీవిట్లుఁ ♦ జేతువనుచుఁ
జెప్పినను గూడ నమ్మని ♦ చెడ్డచేత
లేల జేతువు? తత్ఫల ♦ మేల గుడువ? 123

తే॥ అనుచు హితబోధచేయ ది ♦ వాంధమగు త
శ్శ్యేనమును గూడ గరుడుని ♦ చెల్మికాఁడ
యనుచు విడనాడి యెంతయు ♦ నాప్తుఁడగుటఁ
బిలువ బంచెను రాబందుఁ ♦ బేర్మినంత. 124

మ॥ తిలదానంబులఁ బట్టుఁ బ్రేతముల కుం ♦ దీర్ఘాఘ్నులం దీ (ర్చు పెం

జలతీరంబుల నీరుకాసులకు చేఁ ♦ జాచున్ సదాముష్టి; నీ
చులకన్ బెద్దయనంగఁబేర్వడసి దు♦ష్టుండొక్కఁడీక్ష్మాననా
స్థలిరాబందువు గూబ బంధుఁడొకఁడి ♦ చ్చాఁరీతి వచ్చెన్
(వడిన్.

గీ॥ అటుల వచ్చియు దుఃఖించు ♦ నంధపక్షి
గాంచి చింతించి ధైర్యంబు ♦ గఱుపఁ దలఁచి
ఱెక్కలల్లార్చి బంధుని ♦ నిక్కిజూచి
"భయము నొందకు నేనుండ ♦ బాంధవుండ." 126

చ॥ అనియిటురాపులుంగుమన♦మారఁగఁబల్కినగూబకంతసం
జనితమునయ్యె ధైర్యము, వి ♦ చారము, గొంత నశించె
(ప్రేత బం
ధునిఁగని సంతసించె, తన♦తోడుతఁగూడి విరోధివర్గమున్
అనిఁదెగటార్పసాయము ను♦దంచితలీల యొనర్ప వేడుచున్

క॥ ఆపద గడవం బెట్టఁగ
నోపిన ఘనుఁడొక్కరుండె ♦ యుర్విని మిత్రుం
డాపగిది నన్ను నీవిపు
డోపఁగ రాబంద! సమయు ♦ మొండొకటబ్బెన్. 128

గీ॥ ఎఱుఁగుదువుకాదె నన్నెంత ♦ హీనముగను

కవివతంసంబు హంసంబు ♦ గాఱు లరచి
చాటుచుండెడి వైఖరి ♦ సఖుఁడ! సుంత
యచటి వార్తలు నీవేగి ♦ యరయ వలయు. 129

గీ॥ నీవు నాతని పాలికి ♦ నెమ్మి నరిగి
నన్నుఁ బడదిట్టి యాతని ♦ నమ్మఁ జేసి
మెలకువుగ వారిగుట్టెల్లఁ ♦ దెలసి రమ్ము
పిదపఁ జూపెద నాప్రభ ♦ వెలుఁగుటెట్లొ! 130

సీ॥ అనిన రాబందు నాకేల ♦ నయ్య! యిట్టి
రట్టు? ప్రేతభూముల స్వేచ్ఛఁ ♦ బొట్టనింపి
యడవి దిరిగెడు మనమేడ ♦ హంసమేడ
తలలు మార్చెడి పని నీకెఁ ♦ దగదు వినుము. 131

ఉ॥ నావుడు గ్రద్దగూబ నయ ♦ నంబుల రక్తపుబొట్లు రాలఁగా
నీవును నాకు నీతులను ♦ నేర్పెడి యంతటి వానివౌదువో!
పోవకయున్నఁ జూడుమిక ♦ బొట్టకు నేదియుఁ బుట్టనీక నీ
కావరమెల్లఁ దీసెదను ♦ కౌశిక మన్నను వెఱ్ఱిపక్షివో!

వ॥ అనిన రాబందు. 133

మ॥ ధనవాంఛా పరితృప్తుఁడై బడుగు,ని ♦ త్యానంద సంధానుఁడై
ఘనకాసారవిహారసంభ్రమములన్ ♦ గాలంబునుంబుచ్చు స
జ్జనపూజ్యుండగురాజహంసమును స్వే ♦ చ్ఛారీతిదర్శించి "మి

మ్మనఘా! చూడగవచ్చినాడ మదిలో ♦ నానంద ముప్పొం
(గగ౯.

వ॥ అని నంత రాజహంస రాబందునింజూచి. 135

చ॥ పులుగ! యిటేల వచ్చితివి ♦ పోలఁగ నీదగు జాతియెద్ది! నీ
చెలువముజూడగామిగుల♦చిత్రము తోఁచెడి ప్రేతవాసనా
కలిత శరీరము౯ బొడగు ♦ గాఁగలకంఠము గల్గు నీవునా
వలనను యెద్దికోరియిటు♦వచ్చితివోయెఱుగంగఁజెప్పుమా! 137

వ॥ అని నంత రాజహాసంబు రాబందునింజూచి.

ఉ॥ ఏటికి సంశయంబు తడ ♦ వేటికి మీఁగరుడుండు నే డర
ణ్యాటులలోన యాబక ది♦వాంధులతోడను వైరమూని స
న్నేటుగ మిమ్ముఁదోడుకొని♦ నేర్పున రమ్మనిబంపెగాన పో
రాటము నందున౯ గరుడ♦రాజునుఁజేరఁగరమ్ముసత్వర౯

క॥ అని యిటులఁ దోట్రు పాటున
జనితంబగు భీతిచేత ♦ జవముడిగిన యా
మనుజాశనుండు బల్కిన
విని హంసము వానితోడ ♦ వివరించె నిటుల్. 139

ఉ॥శత్రుఁడొకండుమాగరుడ♦సన్నిధి నిఁ౯ విహరించువాడె,యా
శత్రులు గిత్రుల౯ శమన ♦ సన్నిధిబంపు, మనంగనిచ్చునే!

గాత్రము ఛిన్న భిన్నముగ ♦ ఖండము ఖండము జేయువాడు
(మూ

ర్తి త్రయమడ్డమైన శర ♦ ధిఁ బడినన్ వినువీధి కేగినన్.

మ॥ అకలంకాత్ముఁడ పాయశూన్యుఁడును ని♦ త్యానంద సం
(ధాన సా

ధకుఁడై దీర్ఘ విచార సారమణియై♦తాత్పర్య సంయుక్తుఁడై
సకలజ్ఞత్వమెఱింగి ప్రౌఢ బలుఁడై♦సాహిత్య సంపన్నుఁడై
ప్రకటింపంబడు వైనతేయు సముఁడే ♦ పాపాత్ముఁడౌ కో
(టుఁడుఁ 140

మ॥ శిరమున్ వంచుక ముండమోపినటెఁదా ♦ జీవచ్ఛన ప్ర
(క్రియన్

దురితాత్ముండు దివాంధుఁడుండుఁగదె! క్రు ♦ద్ధుండయ్యు
(యుద్ధంబునన్

గరుడున్ బోరిజయింపఁగా గలఁడె ని ♦ క్కంబొప్పఁ బ్రా
(ణంబులే

కరణిన్ నిల్పుకొనంగ నేర్చు నకటా♦కాలప్రచోదాత్ముఁడై

గీ॥ గరుడు వరశక్తిఁ దెలియని ♦ గురుఁడ గాను
మాకుఁ గీర్తిని నిల్పెడి ♦ మాన ధనుఁడు;

సమరమందున వెనుదీయు ♦ చవటగాడు
భయముం జెందడు మిన్నుపైఁ ♦ బడినఁగాని 142

చ॥ వదరకు బొమ్మ నీవు నప ♦ వాదునివో లెను, తత్తరంబుతో
వదనములోనకంపుఁ జెడు ♦ వాక్కులుబల్కకువైన తేయుఁడే
బెదరును లేకయుద్ధమునఁ ♦ జేరుముఁ దెచ్చునుమాకుఁజూడనా
మదయుతు గూబద్రుంచఁగల ♦ మాన్యుఁడు తానటజాలు
(బొమ్మికన్.

వ॥ అంత రాబందు. 144

చ॥ పతిగతియించు ముండవలె ♦ పాపము వానికుయుక్తిసాగకన్
మతిచెడి బిక్కఁజచ్చి మరు ♦ మాటలుఁ బల్కకఁ "జిత్త"
(మంచుదా
గతిచెడి రెండు రోజులకు ♦ గానన సీమనుజేరి గూబతో
డుతనటహంసచేతలుఁగ ♦ డుంగడు దెల్పెనుసిగ్గునొందుచున్

గీ॥ గడ్డిఁ గఱచినరీతి యా ♦ కలుష మతులు
గూబ రాబందు గొక్కెర ♦ కొంపఁ గూలి
నట్టు లేదియుఁ దోపక ♦ నచట నిచట
నిశలఁ దిరుఁగాడు చుందురు ♦ నీచమతులు. 146

ఉ॥ పుట్టినవారుగిట్టుట ల♦ పూర్వముగాదు నిమిత్తమాత్రమై
తట్టును హేతుభూతములు ♦ తద్గతి ఘూకము సింహగేహ
(ముఁ
మెట్టినవేళ తద్గృహిణి ♦ మిక్కిలి పున్నెపురాసి పాపమా
పట్టునఁ బ్రాణముల్విడిచె ♦ వన్యములెల్లను గోడువెట్టఁగన్

ఉ॥ చుట్టపుఁజూపుగా గృహము♦జొచ్చిన వారిని నెవ్వరైననుం
నెట్టన గౌరవించుటలు ♦ నీతియుఁ గీర్తియు నేరికైన ని
ప్పట్టున వృద్ధకేసరి య ♦ పార కృపానిధి చేసినట్టి యే
చెట్టది లేకయున్న గురు ♦ శిష్యులకుం గలహంబుజేకురెన్

ఉ॥ కావున మీరలెల్లరు సు♦ఖంబుగ నుండగ నెంతురేని యా
కావరపుం దివాంధమును ♦ గాలిడ నీకుడు నింటిపట్ల నే
దో విపదబ్ధి యాచెనఁటి ♦ ద్రోయఁగఁ బూనిమె నిచ్చకం
(బులన్
బోవుచు నిల్లుజేరునది ♦ ముప్పు ఘటింపక తీర దేరికిన్.

ఉ॥ హెచ్చులు దొల్త బల్కును ష ♦ యించును పిమ్మట నీచుఁ
(డైన యా
తుచ్చపుగూబ నచ్చెలిమి♦తో జనులెందరొ నష్టభ్రష్టులై

వచ్చిన యాపదల్ తలలు♦వ్రచ్చినరీతిగ నయ్యావాదికిన్
మచ్చికమెప్పు పాఠకులు♦మానస వీధి నెఱుంగ నెంతయున్

ఉ॥ సార విహీనమానుడులు ♦ సజ్జన వంచన ప్రాణరక్షణా
ధారులపైని శత్రుతయు♦ దంభము కుత్సితవృత్తియందు స
ద్దారుఁడులూకుఁడంచు సత♦తంబు మనంబున జ్ఞప్తిగల్గియా
క్రూరవిచారుఁ జేరకుఁడు♦కోవిద పాఠకులార ప్రొక్కెదన్

ఉ॥ చింతలువీడి శాంతమున ♦ శ్రీహరి దివ్య పదారవిందనా
చింతన జేయు వృద్ధ గురు♦సింహుల సింహమరాళరాజులన్
వంతల గుందఁజేసి పటు ♦ వైరము గోపల వారిదింపి రా
ద్ధాంతము జేయు గూబకును ♦ దార్కొనె దుర్భరమైన
(కష్టముల్. 152

చ॥ పరమ నికృష్టతంజెడు ది ♦ వాంధుని దుష్టపుగాథ నింత నీ
కరణి వచించి పిమ్మట వి ♦ కాసవచోరచనాచమత్కృతిన్
వరలతృతీయభాగమును♦వ్రాయుదుమీరలుసంతసంబుతో
నరసిదురాత్ము గూబగని♦నంతనె దూరముగాఁదొలంగుడీ!

చ॥ ఇది పఠియించు వారలకు ♦ నే యశుభప్రదపక్షిజాతులన్
బొదలఁగబోదుదుశ్శకున♦పుంభయమెప్పుడు, గాకయున్న వీ

గాత్రము ఛిన్న భిన్నముగ ♦ ఖండము ఖండము జేయువాఁడు
(మూ
ర్తి త్రయమడ్డమైన శర ♦ ధిఁ బడినన్ వినువీధి కేగినన్.

మ॥ అకలంకాత్ముఁడ పాయశూన్యుఁడును ని♦ త్యానంద సం
(ధాన సా
ధకుఁడై దీర్ఘవిచార సారమణియై♦తాత్పర్య సంయుక్తుఁడై
సకలజ్ఞత్వమెఱింగి ప్రౌఢ బలుఁడై♦సాహిత్య సంపన్నుఁడై
ప్రకటింపంబడు వైనతేయు సముఁడే ♦ పాపాత్ముఁడా క్రో
(టుఁడున్ 140

మ॥ శిరముల్ వంచుక ముండమోపివలెఁ దా ♦ జీవచ్ఛవ ప్ర
(క్రియన్
దురితాత్ముండు దివాంధుఁడుండుఁగదె! క్రు ♦ ద్ధుండయ్యు
(యుద్ధంబునన్
గరుడున్ బోరిజయింపఁగా గలఁడె ని ♦ క్కంబొప్పఁ బ్రా
(ణంబులే
కరణిన్ నిల్పుకొనంగ నేర్చు నకటా♦కాలప్రచో దాత్ముఁడై

గీ॥ గరుడు వరశక్తిఁ దెలియని ♦ గురుఁడ గాను
మాకుఁ గీర్తిని నిల్పెడి ♦ మాన ధనుఁడు;

సమరమందున వెనుఁదీయు ♦ చవటగాఁడు
భయమునుఁ బొందఁడు మిన్నుపైఁ ♦ బడినఁగాని 142

చ॥ వదరకు బొమ్మ నీవు నప♦వాదునివోలెను, తత్తరంబుతో
వదనములోనకంపుఁ, జెడు♦వాక్కులుబల్కకునైన తేయుఁడే
బెదరును లేక యుద్ధమునఁ♦బేరునుఁ దెచ్చును మాకుఁ జూడనా
మదయుతు గూబ ద్రుంచఁగల ♦ మాన్యుఁడు తానటజాలు
(బొమ్మికన్.

వ॥ అంత రాబందు. 144

చ॥ పతిగతియించు ముండవలె♦పాపము వానికుయుక్తిసాగకన్
మతిచెడి బిక్కఁజచ్చి మరు ♦ మాటలుఁ బల్కకఁ "జిత్త"
(మంచుదా
గతిచెడి రెండు రోజులకు ♦ గానన సీమను జేరి గూబ తో
డుతనట హంసచేతలుఁగ♦ డుంగడు దెల్పెను సిగ్గునొందుచున్

గీ॥ గడ్డిఁ గఱచినరీతి యా ♦ కలుష మతులు
గూబ రాబందు గోక్కెర ♦ కొంపఁ గూలి
నట్టు లేదియుఁ దోపక ♦ నచట నిచట
నిశలఁ దిరుఁగాడు చుందురు ♦ నీచమతులు. 146

ఉ॥ పుట్టినవారుగిట్టుట ల♦ పూర్వముగాదు నిమిత్తమాత్రమై
తట్టును హేతుభూతములు ♦ తద్గతి ఘూకము సింహగేహ
(ముక్
మెట్టినవేళ తద్గృహిణి ♦ మిక్కిలి ఫున్నెపురాసి పాపమా
పట్టునఁ బ్రాణముల్విడిచె ♦ వన్యములెల్లను గోడువెట్టఁగన్

ఉ॥ చుట్టపుఁజూపుగా గృహము♦జొచ్చిన వారిని నెవ్వరైననుం
నెట్టన గౌరవించుటలు ♦ నీతియుఁ గీర్తియు నేరికైన ని
ప్పట్టున వృద్ధకేసరి య ♦ పార కృపానిధి చేసినట్టి యే
చెట్టది లేకయున్న గురు ♦ శిష్యులకుం గలహంబు జేకురేన్

ఉ॥ కావున మీరలెల్లరు సు♦ఖంబుగ నుండగ నెంతు రేని యా
కావరపుం దివాంధమును ♦ గాలిడ నీకుడు నింటిపట్ల నే
దో విపదబ్ధి యాచెనఁటి ♦ ద్రోయఁగఁ బూనియె నిచ్చకం
(బులన్
బోవుచు నిల్లుజేరునది ♦ ముప్పు ఘటింపక తీరదేరికిన్.

ఉ॥ హెచ్చులు దొల్తబల్కును ష ♦ యించును పిమ్మట నీచుఁ
(డైన యీ
తుచ్ఛపుగూబ నచ్చెలిమి♦తో జనులెందరొ నష్టభ్రష్టులై

వచ్చిన యాపదల్ తలలు♦వ్రచ్చినరీతిగ నయ్యెవారికిన్
మచ్చికమెచ్చు పాఠకులు♦మానస వీధినెఱుంగ నెంతయున్

ఉ॥ సార విహీనమానుడులు ♦ సజ్జన వంచన ప్రాణరక్షణా
ధారులపైని శత్రుతయు♦ దంభము కుత్సితవృత్తియందు స
ద్దారుడులూకుడంచు సత♦తంబు మనంబున జ్ఞప్తిగల్గియా
క్రూరవిచారుఁ జేరకుఁడు♦కోవిద పాఠకులార ప్రొక్కెదన్

ఉ॥ చింతలువీడి శాంతమున ♦ శ్రీహరి దివ్య పదారవింద నా
చింతనజేయు వృద్ధ గురు♦సింహుల సింహమరాళరాజులన్
వంతల గుందఁజేసి పటు ♦ వైరము గోపల వారిదింపి రా
ద్ధాంతము జేయు గూబకును ♦ దార్క్ష్య.నె దుర్భరమైన
(కష్టముల్. 152

చ॥ పరమ నికృష్టతంజెడు ది ♦ వాంధుని దుష్టపుగాథ౦కింత నీ
కరణివచించి పిమ్మట వి ♦ కాసవచోరచనాచమత్కృతిన్
వరలతృతీయభాగమును♦ప్రాయుదుమీరలుసంతసంబుతో
నరసిదురాత్ము గూబగని♦నంతనె దూరముగాఁదొలంగుడీ!

చ॥ ఇది పఠియించువారలకు ♦ నే యశుభప్రదపక్షిజాతులన్
బాదలఁగబోదుదుశ్శకున♦పుంభయ మెప్పుడు, గాకయున్న వీ

రదనునవైన తేయుశుభ♦దంచిత నామము సంస్మరింప, వి
ష్ణుధయకు బాత్రులై సిరుల ♦ శోభిలుచుందురెల్లపౌ)
(ద్ధులక. 154

ఇది శ్రీహనుమద్దేవ దయారస లసత్కటాక్ష
కవితాధురీణ పంతము గోపనార్య పుత్ర
ఆంజనేయ కవి కృత దివాంధ
మ ను ప ద్య కా వ్య ము న
ద్వి తీ య భా గ ము
స మా ప్త ము.



శ్రీకృష్ణార్పణమస్తు.